# శ బ రి

శ్రీ మదిత్యాది శ్రీమాన్

కవిరత్న, కవిశేఖర, సుధీమణి,

శ్రీ గుదిమెళ్ల రామానుజాచార్య

ప్రణీతము

ముక్తిపల్లి అగ్రహారము,

రేపల్లె తాలూకా.

# శబరి

కృతికర్త:

శ్రీమాన్ కవిరత్న, కవిశేఖర, సుధీమణి,

శ్రీ గుదిమెళ్ల రామానుజాచార్యులు,

ముక్తిపల్లి అగ్రహారము.

కృతిపతి:

శ్రీమాన్ ముడుంబై వరాహ నరసింహాచార్యులు, బి. ఏ.,

రాజమండ్రి.



1956

[వెల 0-12-0

# శ బ రి

మన్మథ హేమంతము

ప్రతులు 1000

ద్వితీయ ముద్రణము

మినర్వాప్రెస్, బందరు

వెల ముప్పావలా

ప్రాప్తిస్థానము
ముక్తిపల్లి అగ్రహారము
రేపల్లె తాలూకా
లేక
వెంకట్రామా అండ్ కో అన్ని బ్రాంచీలు



శ్రీ మదిత్యాది శ్రీమాన్ కవిరత్న, కవిశేఖర, సుధీమణి,
శ్రీ గుదిమెళ్ల రామానుజాచార్యులు,
ముక్తిపల్లి అగ్రహారము



కృతిపతి శ్రీమాన్

ముసాంబై వరాహ నరసింహాచార్యులు,

బి. ఏ.,

రాజమండ్రి

# అభిప్రాయము

Sri Tirumala Narasimhachary — Vizianagaram

incipal, Maharaja's Sanskrit College. — 10-6-1951

ప్రసంగవశమునఁ గృతిపతిగారీ 'శబరి' కావ్యమునుగూర్చి
అభిప్రాయము నపేక్షించి ముద్రణమున వెలువడిన కొంత
గ. ంమ్ము నాకందించిరి. వ్యవధిలేమిచే స్థాలీపులాక న్యాయముగ
ంచితిని. కవిగారి రచనాసామర్థ్య మింపుగొల్పుచు మనో
ము నున్నది. ఛందోభాషావిషయములందు సంప్రదాయ
ను లింపకయే నవీనుల కనువగు రీతిని భావప్రకటనము
ముగఁగావించి శైలీమాధుర్యమును జక్కఁగ సమకూర్చిరి.
తెనుఁగు నుడులతో, భావోచితపదపరికరముతో, మనోజ్ఞ
రతో, హృదయంగమముగను నాబాలగోపాల మాకర్షక
ంగను రచన సాగించి వస్త్వనుగుణముగఁ గావ్యప్రయోజ
మును జక్కఁగ నిర్వహింపఁగల్గిన కవిగారు కడుంగడు నభినంద
యులు, పండితవంశజులు, స్వయంకవులు, కళారాధకులు నగు
శ్రీమన్నృసింహాచార్యులవారిచేఁ దమకావ్యకన్యా పరిగ్రహణము
వించిన కవిగారి కృత్య మెంతయు సముచితము. కృతికన్య,
తిపిత, కృతిపతులకు నాహృదయపూర్వక ధన్యవాదములు.

తిరుమల నరసింహాచార్యుఁడు

మహారాజ సంస్కృత కళాశాలాధ్యక్షుఁడు.

# ప్రశంస

విద్వాన్ నందినీమందిరం -
శ్రీ దువ్వూరి వేంకటరమణ శాస్త్రి, వాల్తేరు,
ఆంధ్ర విశ్వకళాపరిషత్. 15—2—54.

శబరి చదివితిని - చక్కని కావ్యము - శబరి భక్తిని, ఆమె భావభంగులను వివిధరీతుల వెలువరించిన కవులు పెక్కండ్రు కలరుగాని శ్రీ రామానుజాచార్యులుగారివలె, ఇంత సూక్ష్మ దృక్కుతో శబరి హృదయమును భావింపఁగలిగినవారు కానరారు. ఆ మహనీయుఁడు వాల్మీకి, ఏ దివ్య ముహూర్తమున సృజించినాఁడోగాని ప్రాకృత పాత్రలగు గుహునికి శబరికి దివ్యులతోపాటు చిరప్రతిష్ఠ యేర్పడినది. శబరిచే గుహుని గూడఁ బరామర్శింపఁజేసిన గుదిమెళ్ళవారి భావనాపాటవము ప్రశంసింపఁ దగినది.

విద్వాన్
శ్రీ దువ్వూరి వేంకటరమణ శాస్త్రి,

—

# నా హృదయము

తెలుఁగు సారస్వతమున రెండు మూఁడు దశాబ్దులనుండి కలకండములవంటి ఖండకావ్యము లవతరించుచున్నవి. మంగళో దర్కమైన యిట్టి కవితాశాఖపై గొంతెత్తుచున్న పుంస్కోకిలములలో శ్రీమాన్ గుదిమెళ్ల రామానుజాచార్యులవారికిఁ గల స్థానము మహోదాత్తమైనది. ఆయన బహుకావ్య రచయితగా దేశమునఁ బలుకుబడి గలవారు. మురళీధర విలాసము, శరద్రాత్రి, మాండవి ఇత్యాదులగు కృతు లెన్నో వారి కవితా ప్రతిభలకు మూఁదలగా నిలఁబడుచున్నవి.

కవిరత్న రామానుజాచార్యులుగారి చూపు చాల సూక్ష్మమైనది, సుందరమైనది. రామాయణమున సర్గగ్రథితమైన "శబరీ" గాథను, ఇతి వృత్తముగా నేఱుకొని సంతరించుటలోనే యున్నది యీ కవిరత్నముయొక్క సూక్ష్మ సుందరభావన! "నీకును మాకు, మాకథకు నీకథ కున్న దనాదినుండి యీ లోకు లెఱుంగరాని యతిలోక మహత్తర బంధమేదో! వాల్మీకి యొకండె తా నెఱుగు" అని 'శబరి'చే ననిపించినారు. ఇక్కడ అతిలోక మహత్తర బంధమే కాదు - యతిలోక మహత్తర బంధమనియు నేనందును. ఈ కవిరత్నము సత్త్వగుణ సంపత్తిగల ఋషి. ఆయన ప్రథమ సందర్శనములో నాకీ యనుభూతి కలిగెను.

శ్రీ రామానుజాచార్యులుగారు ఆశుకవులు, ఆయన యెంత వేగముగాఁ బద్యము నడపుదురో, అంతకు మించిన రసభావపరిప్లుతి యీ పద్యములలో నుండుట గమనింపఁ దగినది. అది యుపాసనా లబ్ధమైన సుకృతము!

ఈ 'శబరి' కావ్యము ఒకే గుక్కలో వారు రచించిరో; కానిచో, ఒక గుక్కలో నేను చదివియుండలేను. ఈ కావ్యములోని జాతీయ పదబంధము, తన్మయతా ధోరణి, ధారసౌష్ఠవము, భావస్ఫుటత - ఒకదాని కొకటి వంతులు వోవుచు నన్ను ముగ్ధుని గావించినది. నడచివచ్చిన రామచంద్రుని పాదములు వాచియుండుటఁ జూచి శబరి "ఎంత బాధపడుచుంటివిరా! యని పైఁటచెంగు నోర్నిండుగ నూది నోటిసెగ నింపుచు వెచ్చని కాపువెట్టిన" దఁట! ఇది యెంత హృదయంగమమైన చిత్రణము! ప్రతి పద్యమున నొక రమణీయత యేదో తొలకాడఁజేయుట రసికులు గమనింతురు; తెలుఁగు ఖండకావ్యముల నీ 'శబరి' జాతిరత్నము వంటిది.

కవియేగాక, నటావతంసము, రసజ్ఞ శేఖరుఁడునగు శ్రీమాన్ ముడుంబై వరాహ నరసింహాచార్యులు బి. ఏ. గారు ఏతత్కృతి ప్రియుఁడగుటయు, ఆయన మా రాజమహేంద్రవర వాస్తవ్యుఁడగుటయు నాకు సంతోషములో సంతోషము. కృతికర్త శ్రీ రామానుజాచార్యులుగారి కిదే నాయుపద!

మ॥ సబలమ్మైన యుపాసనా ప్రతిభతో సాధించి, వాగ్దేవతా
కబరీ భారమునన్ సుమస్రజములం గై సేసి, యుద్యద్యశో
నిబిడుండౌ 'గుదిమెళ్ళ' వంశభవ మాణిక్యమ్ము, రామానుజున్
శబరీ కావ్యకళాధురీ రస వచస్స్రష్టన్ బ్రశంసించెదన్.

రాజమహేంద్రవరము,
1–1–1956.

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి,
తెలుగు పండితులు,
వీరేశలింగం హైస్కూలు.

# పీఠిక.

ద్వాదశ భాషా విశారద,
శ్రీ కోట సుందరరామశర్మ,
*M. A., M O. L, M Ed.,*

ఖిడ్కీ,
మకాం: పూనా,
**2-1-1956.**

మిత్రులిప్పుడు వ్రాయవలసిందని అడిగింది, అస లెప్పుడో వ్రాసికొన్నాను 'శబరి' ని గూర్చి మనసులో అప్పు డప్పుడు చదువుకోవడానికి, చదివి వినిపించడానికి వెంటకూడా తెచ్చుకొన్నాను.

శ్రీ మద్రామాయణాది మహాకావ్యాలు ధ్వని విశేషం చేత ఆనంత్యమును పొందుతాయి అన్నాడు ఆలంకారికుడు. ఒక్కొక్క మహారచయిత ఒక్కొక్క నవ్యతను సృష్టిస్తూ రామకథా ఘట్టాన్ని అంటివచ్చాడు. అనుక్తమైన నూత్న తాపుంజం విరజిమ్ముతూ 'శబరి' ఉదయించింది.

ఏదో దేవతా ప్రసన్నత ఉంటేనేగాని 'శబరి' లో సర్వత్ర గోచరించే కవితాధార పుట్టదు. కవి కృతిపతిని గురించి పలికిన "నీ వనినట్టిమాట వాగ్దేవిగళంబు నందుగల తెల్లని ముత్తెపుం బేట, నీ మనోభావము పూలతోట, తమపాట సుధాధునియూట సత్కవీ" అన్నవాక్యాన్ని తిరగవేసి కృతి కర్తకే అన్వయిస్తే అతిశయోక్తి ఆవంతైనా ఉండబోదు. కృతి పతియే అన్నట్లు ఈ కృతి "వసంత సంధ్యలో జలజలరాలు మల్లియలు, దివ్య కళిందనందినీ పులినములో శరన్నిశల మ్రోగెడు కృష్ణుని వేణుగీతికా కలకలము".

ఒక్క ధారయేకాదు. దానికితోడు భావపక్షం ఎంత నాతిగూఢ గూఢభావ వ్యంజకమైనదో చదివే ఆనందించవలసిన విషయం. మచ్చుకు-

1. శబరితో మతంగు డన్నాడట:

   "రాముఁ జూచి కన్ను మూసెద" వని (పద్యం 61)

2. అనుజునితో రాముడంటాడు:

   "నీవుకూడ నాచార్యత స్వీకరించుటకు
   జాలినవాడవు పోలెనుందు" వని (ప. 99)

ఇంతకంటెను సహృదయ హృదయానందదములు అహ మహమికగా వచ్చిన నైకధ్వనివ్యంజకములు ఉన్నాయి. ఉదా-

1. "నీరాకయె రాక, నీదు మధురంబగు
   దర్శనమే, రఘూత్తమా, మాకొక దర్శనంబు" (ప. 47)
2. "కవితా పుష్పద్రుశాఖన్ 'కుహూకుహూ'
   గీతంబులనల్లు సత్కవివి"

అని కృతిపతిచే ననిపించుకొంటలోని ధ్వనితాలంకృతిచేత వాల్మీకిత్వమును తలపించి కథావస్తువును ధ్వనింపజేస్తున్నాడు కవి.

వేదాంతోక్తులు తేటమాటలలో అనిపించిన ఈ కవి రత్నగారి మెళకువ మెచ్చుకోతగింది- ఉదాహరణ—

1. "నిన్ వెదుకంగ సాధ్యమే" (ప. 40)
2. "చేతిమీద నీపండును నీకొసంగి" (ప. 73)

("త్వదీయంవస్తు గోవింద" అన్నట్లు)

శబరిని జీవన్ముక్తనుగా ధ్వనింపజేసిన కవి ఈ పద్యమును జూడుడు

మరచెను దేహమీశబరి, మానసమెల్ల మదేకభావనా
భరమయి యుంట, జేయుపని పాపము, పుణ్య, మెఱుంగ; దంతగా
నెఱిఁగినఁ బండుఁదాఁగొఱికి యిచ్చునె? యిచ్చిన స్వీకరింతునే?
కొఱికినపండు నేనెనఁగఁగోరిన రాముగదా! సహోదరా! (ప. 95)

భ_క్తికిగల ప్రాధాన్యమును జాటు నూహాతో 'జ్ఞాన కర్మలన్ బురదను బూసికొన్న యతిముఖ్యుల'ను (ప. 91) 'శాస్త్రార్థము సేయ బూనుకొను నయ్యల'ను తడవినాడు కవి.

ఇంకను కవిగారి కొన్నికల్పనలు రుచ్యములుగా నున్నవి. ఉదా—

1. 'సీతారాము'లనియేగాని 'రామసీత'లని యోల అనకూడదు. (ప. 66-67)
2. 'జానకీ విరహ భారముతో సగమైన' రాముని 'వ్రేలికిన్ వదులయి'పోయిన ఉంగరమును జూచి 'భద్రము జాగ్రత జారునేమొ! యియ్యది చెయిజారినేని బ్రతుకంతయు వ్యర్థము, ముందుముందు నీ కిదియే శరణ్యమై వెలయు'నన్న శబరి పల్కుల పసందు.
3. శూర్పణఖ వృత్తమును రామకీర్తికి మారాకుగా మలచుట.

కవిగారు శబ్దార్థములలోగల కొత్తదనాన్ని మెచ్చి వాడి నట్లు అచటచట గోచరిస్తుంది. ఉదాహరణ—
నిదానముగా పరికించి (ప. 2) సరేసరి (ప. 24) ముఖాముఖి (ప. 122)
ఇది జీవద్భాషాలక్షణజ్ఞత.

వైష్ణవభక్తి పూర్ణత్వమెరిగిన కవి 'రామానుజము'ను స్ఫురింపజేయు పల్కులు—

1. ప్రపన్నుల కెంగిలి యేమి ? లక్ష్మణా ! (85)
2. స్వయంతపశ్చర్యకు దేశికేద్ర పరిచర్యకు భేదము లేకయుండునా ? (93)
3. ప్రీతినిడినదెల్ల స్వీకరింతు (87)
4. 'అప్రాకృతమైన తను వైభవవృష్టి'కి 'చతురింద్రియ పరాగము శాంతివహించు !'

కొందరనుకోవచ్చు పదబంధము సడలినట్లుందేమో అక్కడక్కడని. కథ కనులముందు నడుస్తున్నట్లు చిత్రించడంకోసం అట్లా జరుగుతుంది. మరి అందరికీ అర్థమయ్యే భాష కావాలంటూ నూటికి తొంభై తొమ్మిదిమంది అర్థంలేని గోల పెడతారే! బిగితక్కువ అనే భాసమాత్రమే. అది నుడికారపు సొంపు, ప్రసాద గుణమునకైన తెలిమాటల పరువుమురువు. సహృదయులైన వారికోసం ధ్వని, కల్పనా ఇత్యాదులు.

శబరిని తపస్వినిగా, భక్తురాలినిగా, సచ్ఛిష్యగా, యోగినిగా చిత్రించి 'శబరి'ని రచించిన కవిగారు స్తుతిపాత్రులు, సత్కార్యులు.

ఇ తి శ మ్.

భవదీయుడు,
ద్వాదశ భాషా విశారద,
శ్రీ కోట సుందరరామశర్మ,
*M. A., M. O. L., M. Ed.,*



# శ్రీ ఆచార్యులవారి ప్రతిభ

శ్రీ కేశిరాజు వేంకట నృసింహ అప్పారావు, **M. A.,**
ప్రిన్సిపాలు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము,
కొవ్వూరు, 5—1—1956.

శబరియొక్క వినిర్మలముగ్ధప్రేమ శ్రీరామచంద్రమూర్తిచే నెంగిలిపండ్ల నారగింప జేసినది. పైకి అనాగరికులుగా గన్పించు నారణ్యకుల యందుగూడ మనము గ్రహింపవలసిన సుగుణము లెన్నో కలవనుమాట నేటికిని సత్యమే. అట్టి అమాయిక శుద్ధ హృదయయగు శబరిని ద్రాక్షాగుళుచ్ఛ సదృశములగు పద్య స్తబకములచే వర్ణించిన శ్రీ ఆచార్యులవారి ప్రతిభ ప్రశంస నీయము.

శ్రీ కేశిరాజు వేంకట నృసింహ అప్పారావు, **M. A.,**
ప్రిన్సిపాలు, ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము.

---

# వీ ను విం దు

కానఁజరించుచో 'శబరిఁ' గావగబోయిన వెంటనంటి, 'రా
మానుజు' లన్నదున్నటుల నన్ను తెరంగిటఁ గన్న నెన్నగా
రాని ముదంబు నీరదము రాకడ కేకడనో మయూరముం
బోనిగతిన్ రసజ్ఞులకుఁ బొల్పెసలారెడు వీనువిందిదై.

బందరు, 13—1—55. నాదెళ్ళ మేధా దక్షిణామూర్తిశాస్త్రి.

# తప్పొప్పుల పట్టిక

| పుట. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| i | 8 | సంస్తన | సంస్తవ |
| 6 | 6 | మెచిపు | మెరపు |
| 6 | 11 | మోహాబెట్టు | మోహాపెట్టు |
| 12 | 4 | పీడితోష్టుడై | పీడితోష్ఠుడై |
| 12 | 14 | గూర్చుఁడి | గూర్చుండి |
| 14 | 18 | బిల్లగ | భిల్లగ |
| 14 | 20 | భిల్లయె | భిల్లియె |
| 15 | 1 | దఁడక | దండక |
| 15 | 13 | నుఁడీ | నుండి |
| 17 | 4 | విషంయ | విషయం |
| 21 | 10 | యుఁడిన | యుండిన |
| 22 | 1 | పండును | పండను |
| 23 | 9 | పఁడటన్న | పండటన్న |
| 23 | 16 | కుఁదువే | కుందువే |
| 24 | 4 | పుషముల్ | పుష్పముల్ |
| 24 | 6 | యయ్యెయొ | నయ్యెయొ |
| 24 | 18 | నగుట | వగుట |
| 27 | 9 | వీవిషయ | నీవిషయ |
| 31 | 5 | వంతులను | వంతులును |
| 31 | 19 | టంజూచి | టఁజూచి |
| 35 | 6 | సేయ | సేయు |
| 36 | 4 | లుఁడిరి | లుండిరి |

శ్రీ ర స్తు

శ్రీ హయగ్రీవాయనమః

# శ్రీ కృ తి ప తి ప్ర శం స

శ్రీరాస్తాం - శుభమేధతాం - సుకవితారేఖా జరీజృంభతా –
మారోగ్యం లభతాం - యశోపిలసతా - మాయుస్సదా వర్ధతాం
శౌరే స్సత్కృపయా ; వరాహనరసింహార్యస్య బీ. ఏ ప్రథా
మారూఢస్య ; ముడుంబవంశ జనుష శ్రీవైష్ణవస్వామినః.

జయ - శబరీకృతి నాయక !
జయ జయ - విద్వన్ముడుంబసత్కుల తిలకా !
జయ - సింహగిరి కుమారక !
జయ జయ _ కవితా ప్రపంచసంస్తన రసికా !

బహిరంతస్సుషమస్వసౌధపురతః ప్రస్యంది గోదావరీ
లహరీ శీతల మందమారుతకళాలాస్యైకలీలా ముహు
ర్ముహు రానీతపయః ప్రపుష్టకవితా పుష్పద్రుశాఖన్ - "కుహూ
కుహూ" గీతంబుల నల్లు సత్కవివి ; నేగూర్తున్ వసంతప్రభన్.

అంతర్వాణుల కాశ్రయంబయిన నీ యశ్రాంత సౌధాంత వి
శ్రాంతైశ్వర్యము - నన్నపార్య కవితా ప్రఖ్యాత గోదావరీ
ప్రాంతావాసము - నానువంశిక గురుత్వ ప్రౌఢపాండిత్య సి
ద్ధాంత ప్రజ్ఞయు - నిత్యమంగళము ; నిత్యశ్రీగ ; వర్ధిల్లుతన్.

శ్రీభాష్యంబును ద్రామిడాగమశిర స్సిద్ధాంతమున్ నేర్చి - త
త్సౌభాగ్యంబున - శిష్యసంతతుల కాచార్యత్వమున్ బూని - వి
ద్యా భోగాదుల - శారదారమల నుత్సాహించు విద్వత్సమా
జై - భవ్యాన్వయ మొందునట్టి "వరహాల్" స్వామిన్ బ్రశంసించెదన్.

కవియై; నాటకరంగమందు నటుఁడై ; కావ్యామృతాస్వాద సం
భవ తత్త్వాదృశపారవశ్యకలనా మాధుర్య సంసూచిత
స్వ వదాన్యత్వ విలాసవై భవుఁడునై ; జానొందు శ్రీసింహాగి
ర్యవదాదాత్మ కుమారుఁడైన నరసింహార్యుండు శ్రీలందుతన్.

నను రావించి, స్వకీయమైన కృతిసంతానంబు విన్పించి - క
మ్మని నా కావ్యము నాలకించి, కవితామాధుర్య రేఖా ముదం
బునకున్ మూటపదార్లతోఁగులుకుఁ దాంబూలంబు నర్పించి, నేఁ
డనుకూలత్వము సూపె నాశబరి నాహ్వానింప నీరీతిగన్.

విలువగల సరిగ గులికెడు
వలువల నర్పించి వెండిపళ్ళెర మందున్.
గల గల రూకలు వోసెను
భళిరా! క్రోక్కొండ సభ సెబాసని పొగడన్.

తాతలనాఁటినుండి కవితాపరిపాక మెఱుంగఁజాలు వి
ఖ్యాతి ముడుంబవంశమున గ్రాలుటఁజేసి, బి. ఏ. పరీక్ష - చే
యూత స్వయం కవీంద్రుఁడయి యుండుటఁబట్టి పరిగ్రహించె సం
ప్రీతి నితండు నాదు శబరీకృతి, నెంత రసజ్ఞ రత్నమో!

స్వామి వరాహాసూరి భగవద్విషయంబును భిక్షవెట్టె నీ
సీమకుఁ - బెద్దతాత నరసింహ సుధీమణి సంస్కృతాంధ్ర భా
షామృదుశైలి సత్కృతులు సల్పె సహస్రము - తండ్రిగారు శ్రీ
ద్రామిడతత్వ వాగమృతధారల ముంచిరి రామతీర్థమున్.

అట్టి ముడుంబవంశ కలశాంబుధిలో శరదిందురీతిగాఁ
బుట్టి - "కలెక్టరైన" పితృముఖ్యుని గూఁతురుబిడ్డ నిట్టె చేఁ
బట్టి - ప్రతిష్ఠతో నుభయవంశములన్ నిలఁబెట్టుచున్న నీ
యట్టి కళాతపస్వి కృతినందుట నాసుకృతంబు మిత్రమా !

తల్లి స్వరూపగ్రంథముల తత్త్వమెఱింగిన ప్రాజ్ఞురాలు - వి
ద్వల్లలితుండు తండ్రి - గురుతానిధి యేడుతరాలనుండి మీ
యిల్లు - సరస్వతీపద సమిద్ధమణీమయ నూపురాలతో
"ఘల్లున" మ్రోగుచున్నయది కావ్యరస గ్రహణామృతాశనా !

రంగమగారు - డిప్యుటి కలక్టరుభార్య - శ్రీతాళికెల్ల ముం
గొంగు పసిండి - సత్యవతిఁ, గూఁతురుబిడ్డను నీకొసంగి మీ
వంగడ మిట్లునిల్పి - తమవంశము నిల్పుకొనంగఁజాలె - ద
త్తుంగని నీ తనూజు - సుహృదుత్తమ మీ పెదతల్లి మిత్రమా !

నీ "వరహాలు" నామ మవనీస్థలి సార్థక మీ బుధాళికిన్
నీవు వరాలమూట వెదనిండుగ నీ వనినట్టి మాట వా
గ్దేవి గళంబునందుగల తెల్లని ముత్తెపుపేఁట, నీ మనో
భావము పూలతోఁట, తమపాట సుధాధునియూట సత్కవీ !

ప్రాయముఁ జూడఁగాఁగలదు పాతిక ముప్పది కించుమించు నీ
కాయములో సువర్ణతలు కాపురమందున నుత్తమవర్ణతల్
హాయినిగొల్పుచుండ, వరహాలను నీప్రథ నాలకించి నీ
కీయఁగ వచ్చినాఁడ సుహృదీశ్వర! నా కృతికన్య కామినిన్.

ఉన్నది నీవు గౌతమికి నొడ్డున నుండిన రాజమండ్రిలో
"ఇన్నిసుపేట" యందుఁగల యెత్తగు చక్కనిమేడయందు - యీ
కన్నియ పల్లెటూరి కవిగారి కుటీరమునుండి వచ్చె నీ
సన్నిధికిన్ శకుంతలగ, సౌహృదముంచి పరిగ్రహింపుమా!

ఛాందసవృత్తితో మెలఁగఁజాలుటచే యతులన్న నెంతయోఁ
బొందిక, పోవుచుండు గురువుల్ గలచోటికి - చంపకోత్పలా
లెందగుపించినన్ హృదయ మిచ్చుచు నీ కృతికన్య వచ్చెఁ గే
లంది సుఖింపుమా! పదములందు సువర్ణత చిందుచుండఁగన్.

నీ సౌధంబున శ్రీకటాక్షములు రాణింపన్ గిరాందేవి తా
నీ సాహిత్యము పెంపుసేయ భగవన్నిర్హేతుకాకస్మికే
ష్టాసౌరభ్యము నీకు నభ్యుదయముల్ గల్పింప విద్వన్మ్రడుం
బై సంసారపరంపరాగత యశోభాగ్యాప్తి వర్ధిల్లుమా!

సిరియును సంపద గలుగుత
వరలుత ధన ధాన్యవృద్ధి వంశాంకురముల్
పెరుగుత పాఁడియు బంటయు
నరసింహాచార్య! నీ కనారతమింటన్.

స్వస్తి - శ్రీకృతి పతయే
స్వస్తి - శ్రీరామభక్తి సముచిత మతయే.
స్వస్తి - కవీశ్వర రతయే
స్వస్తి - త్యాగాది సుగుణ శబలిత నుతయే.



శ్రీరస్తు

శ్రీ హయవదన పరబ్రహ్మణేనమః

# సాక్షాత్కారము

పంపాదివ్య సరోవరాంచిత తటీప్రాంతంబునం దెవ్వరా?
శంపాకారుఁడు శ్యామసుందరుఁడు సాక్షాద్దేవతామూర్తుల
ట్లింపుల్ గుల్కుచు నున్న వారు - భళిరా! యేమా!! తనూశోభలా
గుంపుల్ గట్టిన ధూళిధూసర జటాకూటంబు లా బాహువుల్.

మూపున నల్లదే భుజగభోగములో యన వ్రేలుచున్న వా
చాపము, లా మొలన్ మెఱపు చాడ్పున నున్నవి ఖడ్గవల్లికల్,
దాపున కేగుదెంచిన నిదానముగాఁ బరికించి చూచినన్
జూపున కందదా గురుతు! చూడగ రాజకుమారు లౌదురా!

కువలయశోభలన్ విసరిగొట్టెడు కమ్మని నీలకాంతితో
నవయవ మొప్పుచున్న దదిరా! యది యెక్కడి సోయగంబొ! వా
స్తవముగ నెట్టిపాటి మునిచంద్రులనైనను మోహపెట్టు నీ
యువకుఁడు పెద్దవాఁడువలె నుండెను ముందుగ సాగుచుండుటన్.

రాచకుమారు లీవి - భళిరా! తొలుకాడుచునున్న దిందు - దో
ర్భూచల నాడుచుండె రిపుముఖ్యులఁగూల్చు ప్రతాపరేఖ - వీ
క్షోచిత వేష మియ్యదన నొప్పనుగాని - విచారభావనా
వీచిక - మోమునందు గనిపించుట, నేనిది నమ్మకుండితిన్.

అన్నిటికేమి ? యీ కనులయందము సూడఁగ శక్యమేమి కా
కున్నది - స్త్రీలుగా నయిన నుండక పోతిమటన్న భ్రాంతిలో
నున్నది, లోభ మోహరుచు లూడిన మానులకైన - నిట్టిలో
కోన్నత పూరుషుం డిటుల నుండినవాఁ డిది యేవిచారమో !

కమ్మని చెక్కులందటుల గారుచునున్నవి వెచ్చనైన బా
ష్పమ్ములు ; పాప మెంతటివిచారమొ కాని ముఖాబ్జమందు దై
న్య మ్మగుపించుచుండె - నడుగావలఁ బెట్టఁగ శక్తిలేక, చా
పమ్మొకయూతగా నిలిపి వచ్చుచునుండె నదేపథంబునన్.

రాక్షసజాతి నిండిన దరణ్యము దుష్టమృగాలు వచ్చియే
యేక్షణమందుఁ బైఁబడునో ! యెవ్వఁ డెఱుంగును ? మార్గమో ! కుశా
గ్రక్షతి కోర్వలే మచట గాలుకదల్పగలే ! మెదో మహో
పేక్షయె లేకయున్నఁ గనిపింతురె ? యీ రిటువంటి బాటలన్.

రెండవవాఁడు - పాప మెదిరించిన నెంతటివారి నేనియున్
బిండిని జేయఁగాఁ దగిన వీరతనూపెడు గొప్పవాఁడుగా
నుండిన నుండుగాక - అయయో ! యిపు డీవిధి నుండెనేమి ? యీ
గుండెకు నేమి ఘాత మొనగూడెనొ ! కన్నుల నీరు నిల్చుటన్.

బంగరువంటి దేహ ముపవాసముచేతఁ గృశించుచున్న యీ
క్రొంగున మూటమాత్ర మదిగో ! కనిపించుచునున్న - దందులో
నంగల విన్నిదుంపలును, నారదుకూలము - లింత వాఁడు లోఁ
గ్రుంగుచునుండె హా - తెలియకున్నది కారణ మెంతసూచినన్.

ముం దడు గెత్తివేయ మన మొప్పక - వేయఁగ వీలులేక - వే
యందలబెట్టి కూడ పద మావలఁ బెట్టగ శక్తిలేక - ము
న్ముందుగ సాగు స్వామి పదముల్ తడబాటుగఁ బెట్టుచుండఁ - గే
లందగ నూతమిచ్చు నవురా ! - యితఁడెక్కడి యాత్మబంధువో !

ఎక్కడ కీప్రయాణ ? - మసలెవ్వరు వీరలు ? - గమ్యమేది ? - యీ
ప్రక్కకు వీరు రావలసి వచ్చిన కారణమేమి ? - వీర లీ
చక్కదనంబుతోడ వనిసాగుచునున్న ప్రమాదమేమొ ! - యే
రక్కసియో ! కనుంగొనిన ప్రాణముతోఁ గదలంగనిచ్చునే !

ఐనను ఖడ్గమున్నది - భయం బిఁక నేమియులేదుకాని - యీ
ప్రాణము మీద వచ్చునటువంటి యరణ్యము దీనికేల రాఁ
బూనిరో ! - కాని యీముఖపు పోలిక లెచ్చటో చూచియుంటి - నెం
దైనది జ్ఞప్తిరాదు - హృదయంబున నున్నవి పూర్వవాసనల్.

నేనును వీరివెంటఁ బయనించెద - నప్పుడు వీరలిర్వు రే
రైన దెలుంగవచ్చు - నదె యాశ్రమ మేదియొ కానిపించు - పం
పానది యిద్ది కావలయు - వచ్చెను జ్ఞప్తికి - వీరలందు రాఁ
బూనినవా రటం చెఱుఁగు బోయెత - వారలె రామలక్ష్మణుల్.

ఎంతటి సుప్రభాత మిది ? యేలినవాఁ డల చిత్రకూట మ౯
బ్రాంతము వీడి యీశబరి వద్దకు వచ్చుట యెంతభాగ్య - మీ
సంతస మంతులేదుగద ! సంశ్రితజాతికిఁ గల్పకంబునాఁ
జింతలు దీర్ప మాకిచట సేవయొసంగె నహో విశేషముల్.

ఎన్ని వసంతముల్ గడచె? నిప్పటికా కనిపింతువీవు? - నా
కన్నులు నీనిమిత్తమునఁ గాయలు కాచెను జూచిచూచి ల
క్ష్మన్నను నిన్ను నేనపుడుకాదొకో! చూచితిఁ జిత్రకూటమం
దన్నుడి కేమిలే? - కుశలమా? చిరకాలపుసేవ రాఘవా?

కాయము నిటుప్రాసముల గాసిలఁ జేయుచునున్న గాని - నీ
సోయగ మెంత మాత్రమును సొంపు నశింపక, యంతకంతకున్
ఛాయలు వచ్చుచున్నయది - చక్కని వస్తువుచిక్కిపోయినన్
హాయిగనుండు - నీవిధపునందము లెవ్వరికుండు? రాఘవా!

ఇంటి విశేషమేమి? స్మరియింపవు - మీభరతుండు నీకుఁగాఁ
గంటికి నీరువెట్టుకొని గాసిలుచుండెను రేఁబవళ్ళు - నీ
రంటఁడు, పాదుకాయుగళమందు శిరంబిడి యేడ్చుచుండు - ర
మ్మింటికి - జాలియుండదొకో! యెంతటిరాజకులానఁబుట్టినన్.

బాగుగ మూఁగె నీజడలుపాపము మోమునఁ - గొంచె మెత్తుగా
లాగుము - నారచీరె వదులయ్యె రవంత బిగించుకొమ్మ - యే
మో గద బొత్తుగా నలిగిపోయితి - భోగివి యెంతలోన బై
తాగిగ మారి పోయితివి రాఘవ! నేఁగనఁజాల నీస్థితిన్.

రొమ్మటులున్న దేమి? యెవరో! మనుజాశనులొక్క పెట్టు బా
ణమ్ములు గుప్పియుందు, రవి నాటెను గావలె, నెంతపెద్దగా
యమ్ములు! గూడుగట్టెనదె! యయ్యాయొ! నెత్తురుసూచుచున్నచోఁ
గ్రమ్మనె? యెంతవారికిని గన్నుల బాష్పకణాలు రాఘవా!

ఊర్పుల రేఖతో వణఁకుచున్నది నీయధరంబు - నీ కెదో
తీర్పఁగరాని వేదన మదిన్ జనియించిన రీతినుండెఁ - ౧౦
దర్ప సమానమైన భవదద్భుతరూపవిలాస మింతలో
మార్పునహించె? నేమి కతమయ్య! రఘూత్తమ! చూచుచుండఁగన్.

లక్ష్మణ! యన్నగారి ముఖలక్షణ మిట్లయె నేమి? నీ తనూ
లక్ష్మియుగూడ మారినది - లాతులవల్ల పరాభవంబెదో
సూక్ష్మముగా జనించెనని సూచనసేయును మీస్వరూప మా
పక్ష్మములందు జారిపడు బాష్పములే వివరించు మీ వ్యథన్.

ఉండుము లక్ష్మణా! రఘుకులోద్వహుఁడయ్యెయొ సాక్షినాఁడు లే
యెండకుఁ - జెట్లనీడ నిలు మించుక - పాపము సేదదీరఁ గూ
ర్చుండఁ గలాఁడయేమొ! మదిక్షోభిలుచున్నది మిమ్ముఁజూచి; యే
ముండిన నేమి? నేటి కిటులుండిరి; రేపటిమాట కేమిలే?

రేపటి మాట నీవనకు, రేపును నమ్మి స్వరాజ్యలక్ష్మి నీ
మూపున కెక్కఁబోయి పడిపోయిన సంగతి జ్ఞప్తిలేదె? యీ
రేపులు మాపులెల్ల నొకరీతిగ నుండవు - కాలచక్ర మిం
దాపగరాని దా భ్రమణమందలి తత్వ మెఱుంగ రెవ్వరున్.

నా కదియేమొ! బోసిగఁ గనంబడుచుంటివి హేతువేమి? ద
ర్వీకరసన్నిభంబయిన విల్లు సరేసరి కానిపించు - నా
భీకరమైన ఖడ్గ మగుపించుచునున్నది - లేనివస్తు వే
దో! కనిపింపకున్న, దస లున్నదదేదియొ! నే నెఱుంగుదున్.

మరచితి నిన్ను నే నడుగ మాటలసందున - సీత యేది? - మీ
రిరువురు ముందురా! నడువ కేచ్చటో! పాపము వెన్కఁజిక్కెనే?
సరిసరి బాగు బా గసలు సంగతి చెప్పక దాచెదేమి? ముం
దరుగుము లక్ష్మణా! వదినె దారిని దప్పినదేమొ! చూడుమా!

కదలవు లక్ష్మణా! వదినగారికి నీ కెదియేని మాటపై
హృదయము మారెనా! కదలవేమి? కనుంగవనుండి బాష్పముల్
వదలెద వేలరా! నడచి వచ్చితిరా? శబరీ కుటీర మ
య్యది! దయసేయుఁడీ విషయ మంతయు నచ్చట తెలసుకుందునే!

ఇది సాక్షాత్కారము



శ్రీరస్తు

శ్రీ హయగ్రీవాయనమః

# పంపాసీమ

అదె! శబరీ కుటీరము తదంతిక పావన పాంపవీచికా
మృదుపవనాంకురాగతి నిమీలితలోచనుఁడై న రాముఁ డ
య్యదె నివసించినాఁడు భృశియందు - సతీ విరహానలజ్వాలత్
హృదయ వినిర్గతోచ్ఛ్వాసన బృంద సమాహతి పీడితోష్ఠుఁడై.

ప్రాంగణ దేశ నిస్సర దభంగుర భంగసరస్స మాగతో
త్తుంగ పయఃకణంబులవె! తోయజ బంధు ప్రభాతసేవలో
బంగరుపూలు నాఁ బరగి స్వామి రఘూత్తమ దర్శనాప్తి కు
ప్పొంగుచు వ్రాలుచున్న యవి పూజలు సేయఁ దదంఘ్రిసన్నిధిన్.

కమ్మని యింద్రనీల మణి కాంతులు గుట్టలువోసినట్లు కం
దమ్ముల కంద మొల్కు రఘునాథ వపూరుచులెల్ల సీప్రశా
తమ్మున పాంపవీచి సముదాయములందు స్ఫురించుటన్ గువా
లమ్ములు గూడఁ బూచె నవురా! యదియేమి విచిత్ర శోభయో.

అదిగో! బోయెత - యెదురుగ
కుదురుగఁ గూర్చుండి పండు కొరుకుచు నోటన్
బెదవులు కదలించుచుఁ దా
నెదిగో! యనుచుండె శీర్ష మిటునటు కదలన్.

వెనుక సుమిత్రపట్టి భయపెట్టఁగ ముక్కున వ్రేలుపెట్టి చే
సినది మహాపచారమని చెప్పుచునున్న నదేమి చూచునా?
వినుమని సంజ్ఞచేసినను వీనులఁ బెట్టున? వట్టిమాట! - చా
పెను జెయి రాముఁ డాశబరి పెట్టెడు నెంగిలి కేమిప్రీతియో!

ఆ రఘువంశనాథు హృదయంగమరూపము కన్ను దోయి కా
హారముగా లభింప జపమందలి తారక మంత్రసిద్ధి చే
కూరఁ దదేకదృష్టిరఘుకుంజరుఁ జూచుచు నర్ఘ్యపాద్యసం
భారము లీయగా మరచి వాకొనసాగె సగద్గదోక్తులన్.

దండకనుండి వచ్చితివె? తండ్రి! - పథంబున ముళ్ళు ముట్రిచేఁ
బుండుగ వాచిపోయెఁ బదముల్ రఘుచంద్రమ? - యేది? చూడని
మ్మొండుమ - యెంత బాధపడుచుంటివిరా! యని పైఁటచెంగు నో
ర్నిండుగనూది నోటిసెగ నింపుచు వెచ్చనికాపు పెట్టుచున్.

కన్నుల కద్దుకొంచు. బిగికౌఁగిలిఁ గూర్చుచు, రొమ్ముకద్దుచున్,
సన్నుతి సేయుచున్, బ్రణుతి సల్పుచు, మోదరసైక బాష్పధా
రోన్నతి లెస్సగాఁ దడుపు చూర్పుల వెచ్చనికాపు పెట్టుచున్
బెన్నిధు లివ్వి, నేటికి లభించెను బాదము లంచు జూచుచున్.

నాయన? నీ పవిత్రచరణంబులు దాకెడు గౌరవంబు మా
బోయల వంగడంబునకె ముఖ్యముగాఁగల - దల్లనాఁడు గం
గాయతకూలమందు గుహుఁ డంటిన పాదము లివ్వి - భిల్లవం
శీయుల నోము పంటలివి చేర్పుము - నాతలమీఁద రాఘవా!

చాలును తండ్రి! యీయనేముచాలును జాలును - నీపవిత్రపా
దాలను మత్స్యజీవికలు దాకి తరింపఁగఁ జేసినావు - నీ
మేలును నీకృపాగుణ మమేయమురా! యిదియేమి ప్రేమరా!
చాలును రాఘవా! శబర జాతికి నీ వభిమాన మిచ్చుటల్.

నీకును మాకు, మాకథకు నీకథ, కున్న దనాదినుండి యీ
లోకు లెఱుంగరాని యతిలోక మహత్తరబంధమేదో! - వా
ల్మీకి యొకండె తానెఱుఁగు - మేముకదా భవదన్వయప్రతి
ష్ఠైక నిదానభూతులము స్వామి! - రవంతగఁ బాఱఁజూడుమా!

చేపలకంపుతో నోరులు చెంతకురానికులంబు మాది; - యే
పాపము పుణ్యమున్ గనని పక్షులఁజంపు కిరాతకృత్య, - మా
పాపపుజాతి వాని గనవచ్చి, స్వయంబుగఁ గౌఁగిలించి, ని
క్షేపమువంటి నీచరణ సేవ యొసంగితి విట్టిదుండునే!

వైదిక కర్మముల్ సలుపు భాగ్యములేదు, - తపంబుసేయు మ
ర్యాదకు దూరమైతిమి! -మఖాదులుసేయుట యోగయూనగా
రాదుగదా! ప్రభూ! - యిఁకఁ గిరాతులజాతికి, నీకటాక్షమే
గాదె? తపంబు; యజ్ఞములు; కర్మము; జ్ఞానము; భక్తి; న్యాసమున్.

చల్లని దేహకాంతి వెదచల్లుచు, దండకనెల్ల మెల్ల శో
భిల్లగఁజేయుచున్, నను గవేషణసేయుచు వచ్చియున్న నీ
వల్లగదా! తరించితిని - స్వామి! స్వయంబుగ నీ నిమిత్తమీ
భిల్లమె వచ్చియున్న గనుపింతువె? - నిన్వెదుకంగ సాధ్యమే?

దండక నుండి యీ పగిది తండ్రి! పథశ్రమమోర్చుకొంచుఁ - గో
ధండము నండ జేసుకొని దాసినిమిత్తము వచ్చినాఁడ, వి
ట్లుండుట నీయనుగ్రహ - మదుండనినాడు తపోజపాదులె
న్నుండియు నిష్ఫలంబులు గదోయి! రఘూత్తమ! యెంతవారికిన్.

కంటికి నిద్రయే యసలు గానగరాదని తోచుచున్న ది
ట్లుంటిని పెద్దదాననయియుండుట; వచ్చితి రాక రాక నా
యింటికినేడు, - నీయెదుటనేమియొ చెప్పదలంచి యిట్లు గూ
ర్చుంటి దయానిధీ! శ్రమముసూతువె! నాపలుకాదరింపఁగన్.

"శ్రీరఘురామమూర్తి - శబరీ! యిపుడల్లదె! చిత్రకూటమున్
జేరినవాఁడు - తమ్ముఁడును సీతయువెంబడి నేగుదేర - నీ
కోరిక కొద్దిలోన నొనగూడుచులెమ్మ - తదీయదర్శన
ద్వార తరింతు వీ" వని మతంగుఁడు తెల్పెను, దాసురాలికిన్.

అప్పటినుఁడీ నీకొఱకు నన్నము నిద్రయుఁ గూడ మాని, పం
పాప్పులు గోరులుచుంటి, గొనప్రాణముతో నినుజూచు గోర్కె, నా
యొప్పులు కుప్పవోసి పడియుండుటచేఁ గనిపించినావు నీ
విప్పటి కీవిధాన - ఫలియించెను నాయన! నాతపంబులున్.

అక్షయ్యంబగు దేశికాంఘ్రి పరిచర్యాదీక్ష కీ నాటికీ
సాక్షాత్కార మొసంగినావు భళిరా! స్వామీ! భవద్దర్శనా
పేక్షాభాగ్యము కల్గినందులకు లాభించున్ గదా పుండరీ
కాక్షా! మోక్షము - నీకటాక్షమున మాయంబయ్యెఁ బ్రారబ్ధముల్.

గురువులు యోగదృష్టి రఘుకుంజర! నిన్నని తృప్తిఁ జెందె తా
మరిగిన నాటినుండి భవదాగతి గోరుచుఁగూరుచుంటి నీ
పరిసరమందు సంజకడ పాంపసరోవర వీచులందు నే
విరిసిన కల్వపూవు కనిపించిన నీవను నాసఁ జూచెదన్.

ప్రాకృత చక్షురింద్రియ పరాగము శాంతివహించునట్టు ల
ప్రాకృతమైన నీదు తనువై భవ వృష్టి నొసంగినావు - నీ
రాకయె రాక, నీదు మధురంబగు దర్శనమే రఘూత్తమా
మాకొక దర్శనంబు, వినుమా! భవదాగమ మాగమంబుగన్.

ఎన్నఁడు వత్తువంచు, నను నెన్నఁడు కన్నులఁ జూతువంచు, నా
కెన్నఁడు నీ పదాబ్జయుగ మీతల మోపెడు భాగ్యమంచు, - నిం
కెన్నటి కెన్నఁడింక, నిఁకనెన్నటి కెన్నటికింక నెన్నఁ డిం
కెన్నఁ డటంచుఁ, గోర్కు లుదయించి ఫలించెను నేడు, రాఘవా!

ఆశ్రితవత్సలత్వ మనునట్టి మహాగుణముంటఁ జేసి, మా
ర్గ శ్రమమైన జూడ, కవురా! రఘుసత్తమ! దాసురాలి కీ
యాశ్రయ మిచ్చి తీ శబరియాత్మ తరించెను; ధన్యమయ్యెనా
యాశ్రమసీమ; పంపయన నయ్యది, నీయనుకంపయే గదా!

జింకలఁ బిల్చి నీ కథలు సెప్పుచు, చిల్కలముందు నీదు పే
రుంకవ వెట్టి శారికలనుంచుచు, పొద్దులు పుచ్చుకొంచు, నే
వంక వినీల తోయదము పట్టిన నీవను నూహసేసి, యీ
కింకరి, స్వాగతంబు పలికించినదోయి! మనోమయూరికన్.

యోగికదృష్టి నీవిషయమంతయుఁ జూచి తరించినట్టి మా
శ్రీగురుపాదు లేమని వచించిరో! నీకమనీయరూప మం
తే గద! కోటిమన్మథులు దీటుకురాని భవద్విలాసమం
తే గద!! నీదయాగుణమదే గద!! నీవిషంయబదే కదా!!!

నీ యతిసౌకుమార్యమును, నీ కుసుమాభశరీరశోభ, నీ
ప్రాయము, నీవిలాస విభవంబులు, నీకరుణాకటాక్షముల్,
నీ యతిమానుషస్థితియు, నీస్మితపూర్వకభాషణాదులో
నాయన! యోగదృష్టిఁ గనినారు గురూత్తము, లెంతధన్యులో!

అట్టి మహాత్ములెల్ల గురులౌటను, వారల పాదసేవ చేఁ
బట్టినదాది, నీసుగుణవర్ణనతోఁ జెవినిండిపోయెఁ, గాఁ
బట్టియె నింతదాఁక రఘువల్లభ; నీకై గనుకోర్కితోడ, నీ
కట్టెను నిల్పితిన్ - నిలుపగల్గిన దానికి లాభ మొందితిన్.

విప్పిన తమ్మిపూలు కనిపించిన నాకెపుడైనగాని పం
పాపూలఁ; గోసి తెచ్చి యివియన్నియు నీకనుదోయి తోడ దీ
టౌప్పుచు నున్నవంచు, నెదనుంచుచు, గన్నులకద్దికొంచు, నే
నిప్పని జేసితిన్ రఘుకులేశ్వర! నీకయి ప్రొద్దుపోవఁగన్.

ఎక్కడ నీవు? నీచరితమెక్కడ? నీకథ యేమి? నీగుణం
బెక్కడ? నీపరాక్రమములెక్కడ? నీహితచర్యలేమి? నీ
చక్కదనంబు నీసుగుణసంపదలెక్కడ? బోయదాని యి
ల్లెక్కడ? నీవు వచ్చుటది యెక్కడ? నక్కకు నాగలోకమా?

నాయన! రామచంద్ర! కరుణానిధి! బంగరుతండ్రి! యేది నీ
కాయము - నొక్కసారి ననుగౌఁగిలి గట్టిగఁజేయనిమ్ము - యీ
బోయెత పుణ్యభూరుహము పూచి ఫలించినదిన్నినాళ్లు - కా
హా!! యింకఁజాలురా! రఘువరా! యిది నా సుకృతైకరాశిరా!

వచ్చితిగాని నాపయిన వత్సలతా గుణముంచి, దాసికిన్
నచ్చఁగలేద - యొంటిరిగ నాయన! వచ్చుట? నాకుటీరముఁ
బచ్చఁగ జానకీయుతుఁడవై చనుదెంచిన నెంత మంచి, దీ
మచ్చయె నేఁడు నా హృదయమందున బెట్టితి పెద్దచిచ్చుగా.

శంపయు మేఘమున్ గలియుచందము సీతయు నీవుకూడి మా
పంపకుఁజేరవత్తువని ప్రాణములన్నియు జిక్కఁబట్టి యీ
కొంపను నమ్మియుంటి - రఘుకుంజర! తీయని పండ్లుకోసి యీ
గంపకు నింపితిన్ - మనసుకైన భుజింపక పోతి వేదియున్.

ఉంటివి చిత్రకూట శిఖరోపరి - పంచవటీ ప్రదేశమం
దుంటివి కొన్ని నాళ్లు సతియుండఁగ వెంబడి - మానులెల్ల మీ
జంటను జూచి యేపగిది సంతసమందిరో! నాదు దాసి యిం
దుంట నెఱుంగవే? యెఱిఁగియుండి యుపేక్షగ నూరకుంటివే.

సీతను వెంటబెట్టుకొని చేరెద వీశబరీకుటీరమున్
బ్రీతిని రేబవళ్లు నిదురింపక యిట్లు నిరీక్షనుంటి - నా
వ్రాతకు నేమి సేతు వటువంటిదశన్ మిముఁజూచుభాగ్యమీ
నాతికి లేదుగావలయు నాయన! యెంతటిపాపురాలనో!

నీసతితోడ నిన్నిఁకను నే గనుగొందునె? - యంతభాగ్య మీ
దాసికి గల్గునే! ముసలిదానను - యెప్పుడు రాలిపోదునో!
దోసెడునీరు లో నిముడదోయి! రఘూత్తమ! రాముఁజూచి క
న్మూసెదవంచు నాకు గురుముఖ్యుఁడు తెల్పుటచేత నిల్చితిన్.

జానకితోడ వత్తువని, చల్లనిపాంపసరస్సువాసనల్
ప్రాణములేచిరా శబరి యాశ్రమమందున నుందువంచు, లో
లోన దలంచితిన్ - దుదకు లోపముసేసితివాశలెల్ల - నా
స్నానము పూజయున్ జపము సర్వమునేమయిపోయె నాయనా!

సొమ్ములు తీసివైచినను సొంపు నశింపదు - చేతిలోని ఖ
డ్గమ్ము, ధనుస్సు, బాణములు, కన్పడకుండిన శోభపోదు - మా
యమ్మ, యయోనిజాత. - క్షణమావలనుండిన నీస్వరూప మే
వమ్మయి పోయినట్లు కనుపట్టును నా కదియేమొ! నాయనా!

ఆ జనకాత్మజాత క్షణమైనను వీడక వెంటనున్న - నా
తేజము దుర్నిరీక్ష్య మిఁక దివ్యుల కేనియు నప్రమేయ మా
తేజము - దాసికా విధపుఁదేజముఁ జూపఁకఁబోతి వున్న దే
దో! జపదోషమో! పలుకుదోసమొ! లేకుపచారదోషమో!

ఇంతకు సీత పేరు మొదలెందునకుంచిరొ! నీవు జానకీ
కాంతుఁడవంచుఁ బిల్చుటకుగారణమేదియొ! నీకుముందు నీ
కాంతను బేరులో నిలుపగల్గినదాని రహస్యమేమొ! యొ
క్కింత నిదెప్పుడైనఁ బరికించితె? లే.కడిగించిచూచితే?

ఏమనుజుండు నిన్ను స్మరియింపఁగఁబూనిన, ముందు జానకీ
రాముఁడ వందు౹గాని యనరారుగదా యిఁక రామసీతగా
నేమి నిదానమో! తెలియునే? నిజమిప్పటికైన గాని - నా
స్వామివి, చెప్పకూడ దిటువంటి రహస్యములెంతవారికిన్.

సీత, తనంత తా నెడమచే నవలీలగనెత్తు కార్ముకం
బాతరి నీవులేచి కుడి హ స్తముతో నది యె త్తగల్గి, తీ
చేతుల జంటలో నెడమచేతికి నెత్తుట గొప్పగాన, వి
ఖ్యాతిని గూర్చినారు జనకాత్మజకే ఋషులెల్ల రాఘవా!

అందఱు లేనిచోట, కుశికాత్మజు నీ విషయంబులో శతా
నందుఁడు - మెల్లగా - జనకనందిని రామునకన్నమించె నే
మందువు చెప్పుమన్న - నతఁ డప్పుడు సంధి కుదిర్చె - సీతపే
ర్మందుగ బెట్టి, రామపదముంచినవాఁ డటువెన్క రాఘవా!

భూతభవిష్యదర్థములు పూర్ణముగాఁ బరికించు శ్రీతపో
జ్యోతి, మతంగమౌని యిది చూచెనుగావలె యోగదృష్టితో
బ్రీతిగ నొక్కనాడు పిలిపించి ననున్ వివరించె నిద్ది, యీ
రీతిఁ బ్రసంగమందు దొరలెన్ - క్షమియింపుము నీవు నాయనా!

అమ్మనుజూచి సంతసము నందెడు భాగ్యము దాసురాలి జ
న్మమ్మున కింక లేదనుట మాత్రము సత్యము, పోనిలెమ్ము; నీ
కమ్మని దర్శనంబయిన గల్గిన దంతిమొచాలు లెమ్ము ప్రా
ణమ్ములు లేచివచ్చినవి, నాయనువాడవు నీవె - నాయనా!

[illegible]ావనుకొంటి నీవయిన రాఘవ! యీపదునాలు గేండ్లు గో
దావరి తీరమందుగల దండకయందె ముగించి, యింటికే
పోవును గాని - స్వామి యిట మోమును జూపడు, జాడలేదు నా
భావనసేసి యేడ్చితినిబాబు! రమారమి కొన్ని యేండ్లుగా.

ప్రేమ గలట్టి వస్తు వగుపింపక పోయిన నెంత బాధరా
స్వామి! రఘూత్తమా! యనుభవజ్ఞుడ వియ్యది నీవెఱుంగవా
యేమి? యొకండు నీకొఱకు నేడ్చిన జూచి సహింప జాలవో
యేమొ! యలభ్య దర్శనమునిచ్చెద వీవిధి నెంతవారికిన్.

దండకనుండి యీవలకు దాటకయే పదునాలుగేడు లం
ముండి యయోధ్య కేతరలియుఁడిన నీకథకేమి? గాని - యీ
మొండి ఘటంబు జోలి వినఁబోవుట గల్గునె? చేతిమీఁద నీ
పంపును నీకొసంగి కనుభాగ్యము దాసికి నుండఁగల్గునే?

ఇది పంపా సీమ

—

శ్రీ ర స్తు
శ్రీ హయగ్రీవాయనమః

# ఉచ్ఛిష్టము

పండును మాటకున్ స్మృతికివచ్చెను రాఘవ! యారగింపు మీ
పండును - నిన్న గోసుకొనివచ్చితి - నే రుచి జూచినాను లే
గుండె దిటంబుసేసి రఘుకుంజర! కొంచెము సేదదీర నీ
పండు రసంబు పిండితిని బాబు! రవంత పరిగ్రహింపుమా!

తీయనిదాని కీ నీకొఱకుఁ దెచ్చితిఁ గొంచెము తీసుకొమ్మ - మా
నాయనగాదు - మాజనకనందిని వేళకునిన్ను జూడలే
దాయె గదా? సహోదరున కాకలి దప్పియు రెండుకూడ లే
వాయెను - గాలితో బ్రతుకు నాకలిబాధ నతండెఱుంగునా!

పుట్టుకతోడ నాతఁడొక భోగియెకాని, తొలంగిపోయె ని
ప్పట్టున భోగసంపదలు వానికి బాపము!! రేఁబవళ్లు నే
పుట్టను! చెట్టుకో తిరిగి పొద్దులు పుచ్చుచు నిన్ను దాఁ బగన్
బట్టినవాఁడువోలె నెడబాయఁడురా! యిది యెంతజాలిరా!

తత్వము సూడ నీతఁడొక తమ్ముఁడె కాని యతండు సూపు శే
షత్వము మాత్రి మద్భుతము; - స్థానము మారిన పాప మీతఁడీ
తత్వము మార కుండెనుగదా! - నినుజూడగ బ్రాకులాడు శే
తత్వము - వేయికళ్ల నినుదాచుటె తత్వము వాని కెప్పుడున్

మొన్ననె కోసితిన్ - బగల ముగ్గినదీఫల - మెంతతీయగా
నున్నదో! - యారగింపుమిది - యూరక చూచెదవేల! నాయనా!
తిన్నఁగఁ జూడు మేకొఱికిదెచ్చితి ముందుగ - పండు పుల్లగా
నున్న నొసంగ నాకు మనసుండునె, దాసిని నమ్మవైతివే?

చూడు మిదొక్కపండు - రుచి జూచెదనుండుము - కొంచెమేదియో
వాడిన దానివోలెఁ గనుపట్టుచునున్నది - 'పారవేయు మీ
పాడు ఫలం' బటంచు నొకపండును గొంచెము చప్పరించి "మో
మోడక యారగింపు' మనబోవఁ, దటాలున దమ్ముఁడంతటన్.

రాముని జెయ్యిబట్టి, తినరాదిది యెంగిలి పఁడటన్న - శ్రీ
రాముఁడు నవ్వుచున్, శబరిరా! యది - చక్కఁగ బారఁజూడుమా,
ప్రేమకు లేదురా విలువ - వెయ్యిభవంబులకైన జెందగా
లేమిది - నేటిరోజుకు ఫలించెను నాతప మీవిధంబుగన్.'

'ఎంగిలి పండుగాఁ దలచితే యిది లక్ష్మణ! - యెంతమాట! - ముం
గొంగున మూట గట్టెదవు కోపమునెప్పుడు - స్వీయుఁ డన్యుఁడన్
సంగతియే యెఱుంగ వీఁకఁజాలును - మాభరతుండు వచ్చినన్
దొంగగ బట్టుకొంటి విది దోషముగా గమనింపకుండువే?

అదియొక పుణ్యారాశి - విషయస్పృహ కందని పుణ్యభూమి - యా
హృదయము యోగిసంతతుల కెన్నఁగరాని షడక్షరీ సుధా
హ్రాదము - తపస్సువాసనలు వ్యాప్తివహించిన దేవతావనం
బిది - శబరీ శుకీగళిత మీ ఫలమందుట, యెంతవారికో!

చూడదు - తదాశ్రమంబెటుల శోభిలుచున్నదో! యోగశక్తిచే
గూడిన దీ ప్రదేశ, మదిగో! పరికింపుము - చెట్లమీఁద వ్రే
లాడుచున్న వల్కలములయ్యవె! నేటికి నారకున్న వీ
వాడని పుష్పముల్, శబరి భాగ్యము లక్ష్మణ! చెప్పకుండునే!

ఆజడలెట్లు కర్మలములయ్యెనో! చూడుము - కట్టుకొన్న కృ
ష్ణాజినచేల మేపగిది యయ్యెయొ! బొంతలురేగి యెంతగా
బూజటు పట్టెనో గనుము - పుట్టినదాది తపస్సమాధి నీ
రాజినమిచ్చె జీవితము లక్ష్మణ! యెంతటి జ్ఞానరాశియో?

త్వరబడుచుంటి వీ వసలు వాస్తవమెంచక, యున్నదిందులోఁ
బరమరహస్య మిద్ది - సులభంబుగ జెప్పఁగ వీలులేదు - నీ
కొఱకిది తెచ్చినానసుచు, - గూరిమితోఁ జెయిఁబెట్టె నేని సం
బరమున స్వీకరింతును - బ్రిపన్నుల కెంగిలియేమి? లక్ష్మణా!

యావదాత్మ సమితి కాత్మగా నేనున్న
నాకుమాత్ర మాత్మజ్ఞాని సూవె?
యొరులమాటకేమి? యుచ్ఛిష్టమనుమాట
నా మతంబునందు నాకు లేదు.

నీవుకూడ ముందు, నేనిప్పు డన్నది
సోదరుండ నగుటఁ జూడ గలవు.
వృషల భోజనంబొ! వేరొని యెంగిలిముద్దొ,
ప్రీతినిడినదెల్ల స్వీకరింతు.

?నబడునేమొ ? యామెకీవి, వెఱ్ఱిప్రసంగముల ప్ర,మేమి ని
?నకుము ; - విన్నచో శబరియాత్మ చివ్రు[illegible] - ల
క్ష్మణ ! భగవత్ప్రపన్నులకు జన్మలు వేరు, కులాలు వేరు, నీ
కనుభవ మందరాని విషయంబిది, యింకొకమాట చూడుమా !

జాతినిబట్టిచూడ కపచారమగున్, శబరీ చరిత్రలో
జాతికులాలు నిల్చుటకు స్థానములేదు - ప్రపన్నురాలి నీ
గోతిని దింపఁబోకు - మదిగో చరమార్థము నాశ్రయించి తా
నూతగ బట్టుకొన్నదదె, యుత్తమదేశిక పాదపద్మముల్.

మోక్షముగోరి తాను గురుముఖ్యపదాబ్జము లాశ్రయించి యీ
దీక్షవహించె మా శబరి - దీనికి జాతి మతాది భేదముల్
కక్షవహించి చెప్పుటకు గారణమున్నదె ? కాని ప్రేమకున్
లక్షణ మీ యుపేక్షను ; దిరస్కృతి సేయుటయేమి ? తమ్ముఁడా !

గురువులు పోవు త్రోవఁ, దనుగూడ గమింపఁగ నున్నవ్యక్తి - స
ద్గురు కరుణాకటాక్షమను గొమ్మను గట్టిగబట్టుకొన్న దీ
చరమరహస్య నిష్ఠులకు జాలరు లక్ష్మణ ! జ్ఞానకర్మలన్
బురదను బూసుకొన్న యతిముఖ్యులు, లక్షలలక్షలుండినన్.

కార్యముమించి వచ్చెనని కాదుసుమీ ? - యెటువంటివారికా
చార్యకటాక్షమే యొసఁగు సద్గతి - శిష్యులు దేశికేంద్ర స
చ్చర్యయె సాక్షిగా నిలపి సల్పుచునుందురు దేహయాత్ర ! ధీ
వర్య ! లభించునే ? శబరివంటి తపస్విని, శిష్యురాలుగా.

ఆర్యులు మెచ్చునట్లు, గురులన్న మహాత్తరభక్తితోడఁ గైం
కర్యముసేసి, యైహికసుఖంబులపై నభిలాషమీఁగి - యా
చార్య కటాక్షముం గనిన చక్కనివ్యక్తిగదా - స్వయంతప
శ్చర్యకు - దేశికేంద్రపరిచర్యకు - భేదములేక యుండునా?

పెద్దలసేవ చేసినది, పెద్దలవల్ల విశేషశాస్త్రముల్
తద్దయు నాలకించినది, దానికిఁదోడుగ బ్రహ్మచర్య మం
దొద్దిక మీరఁ దా నిలచియున్నది; యట్టి మహాత్మురాలు, నా
యొద్దకు దెచ్చి యేపగిది నుంచును - యెంగిలిపండ్లు? లక్ష్మణా!

మరచెను దేహమీశబరి, మానసమెల్ల మదేకభావనా
భరమయి యుంట, జేయుపని పాపము, పుణ్య, మెఱుంగ; దంతగా
నెఱిఁగినఁ బండుఁదాఁగొఱికి యిచ్చునె? యిచ్చిన స్వీకరింతునే!
కొఱికినపండు నేదినఁగఁగోరిన రాదుగదా! సహోదరా!

పరులిదివిన్న చుల్కనగ వాకొనుచుందురు, లక్ష్మణా! సహో
దర! శబరీప్రసాదము సుధారస, మందఱికిద్ది తేరగా
దొరకదు - దీనికోసమయి దూరమునుండి శ్రమించినాఁడ, నా
కొఱికిన దేను తిన్న ననగూడదు మీ రిటువంటిగోప్యముల్.

చాలును లక్ష్మణా! యిదియెచాలును - జాతిమతాల జోలి నా
కేల? గుణంబులున్న నవియేమయిపోయిన వానిజోలి నా
కేల? గురూత్తముండెవనికింత కటాక్షము రక్షకట్టునో!
చాలును, వానిభారమిఁక సర్వము నాకయి నేవహించెదన్.

ఆచార్యుని సేవించుట
గాచుట నావద్ద మోక్షధన మనుకొ మ్మా
దాచినసిరి, దాతలకెడ
జేచీలెన్నఁటికి నేను బెట్టఁగఁజాలన్.

చర్యలు సూచినన్ ముఖపుసంపద సూచిన నీవుకూడ నా
చార్యత స్వీకరించుటకుఁ జాలినవాడవుపోలె నుందు, వా
శ్చర్యము లేదు - నీనడక చాలనిగూఢము - శేషతైక మా
ధుర్యము జూచుచున్నపుడె దోచును, లక్ష్మణ! నీస్వరూపముల్.

అర్థమెఱుంగ వీవిషయమంతయు వైష్ణవసంప్రదాయ ది
వ్యార్థము, నాకు, మాశబరికారయ నెంగిలిలేని మాట, ము
ఖ్యార్థము - బాధ దీనికగునప్పుడు లక్షణ సేయుచుందు శా
స్త్రార్థము సేయఁబూనుకొను నయ్యలు - బోఁయతచూచె, లెమ్మిఁకన్.

అవ్వ! ఫలించెనే? సుకృతమంతయు నీ చిరకాలవాంఛితం
బివ్వనిలో లభించెనె? తరించితివే? గురుపాద సేవలన్
గువ్వలు పోసినావు కనుగొంటివె! నీ పరమార్థమేదొ! నీ
కెవ్వరు స్నానపానవిధులేవియు విఘ్నము సేయకుందు రే?

నీదుసపర్యచే మనసునిండెను - నీయుపశాంతిసూక్తి మ
ర్యాదకె క్షుత్పిపాస లివియన్నియు శాంతివహించె, నవ్వ! - నీ
యాదరణంబుచేత హృదయవ్యథ సైతము శాంతినందె నా
కేది కొరంతలేదు శ్రమణీ! పరిపూర్తిగ తృప్తిచెందితిన్.

వింటిని మీగురూత్తముల విశ్వజన స్తవనీయ వృత్తమున్
గంటిని, నీపరిభావమును - గానన శోభకు మెచ్చుకొంటిఁ - గై
కొంటిని మీసపర్య - లనుకొంటిని మంచిదటంచుఁ గాని, మా
యింటిదె లేకపోయె, శబరీ! నినుజూచుట కేమిసేయుదున్.

పాడు నిశాటి మమ్మొకటి పట్టెను భూతముపోలె మొన్న - నా
బోడిది వచ్చి నాపయిన మోహముతో బడనున్న వేళ, నీ
వాడకు బొమ్మటంచు మరవాడిని జూపితి జేతులార - యీ
కీడును నేనుగాదె కలిగించితి సీతకుఁ జూచుచుండఁగన్.

అసలది చుప్పనాతి - విషయస్పృహతోఁ దిరుగాడుచున్న పెన్
బసరము - దానితో నెపుడు నవ్వనివాడను చేతులార నీ
విసమును మ్రింగినా ననుభవింతును - లక్ష్మణుఁడైన ముందుగా
గసరెనె? తెచ్చెనా మొకరికన్నను నొక్కర మిద్ది కొంపకున్.

ప్రక్క కళత్రమున్న దను భావమునైనను జూడకుండ - నా
రక్కసితోడ నయ్యయొ - సరాగములాడఁగ బూనుకొన్న నా
కెక్కడ దక్కునమ్మ! సిరి - యేడ్చెదనిప్పుడు; చుప్పనాతితోఁ
జిక్కులుగాక నాకసలు సీతయె దక్కకపోయె నక్కటా!

అట్టినిశాటితోడఁ బరిహాసములాడుటగాదె కొంప పో
గొట్టితిఁ జూచుచుండ - మది గుందుచునుంటి దివానిశంబు, నీ
గుట్టు, పరుండెవండు వినగూడదు, నే ననరాదు, నీవు కాఁ
బట్టి మనఃపరిశాంతికయి పాతరలాడుచు విన్నవించితిన్.

గోటికే సాధ్యమైనపని గొడ్డలికిప్పు డసాధ్యమయ్యె, దో
సూట వధూటితోడి పరిహాసములూరక పోవునంటి ని
నాటికి నెంత తెచ్చెనో! కనంబడెనే? శ్రీమణీ! యటంచుఁ గ
న్నీటి కణాలతోఁ గనులునింపిన, - బోయెత తత్తరంబునన్.

ఇది ఉచ్ఛిష్టము



—

శ్రీరస్తు

శ్రీ హయగ్రీవాయనమః

# యోగాగ్ని

ముందుకువ్రాలి, రాఘవుని ముద్దులుమూటలుగట్టు కన్నులన్
జిందెడు బాష్పముల్ వణఁకు చేతులతోఁ దడియార్చి, మోము-
జిందులుద్రొక్క ముఁగురులు చెంతకుద్రోయుచు, నాయనా!
మెందుకు? చింత - శూర్పణఖ మీకొనరించిన దోసమున్నదే!

ముద్దులుగుల్క నీభువనమోహనమూర్తికి దాళలేక, తా
కొద్దిగ హద్దుమీరె ననుకొందము, దానికిదోసమేమి? నీ
యొద్దనిరీహులే ప్రణయముంచి తపించెదు మచ్చుమందెదో -
కద్దట, కాకయున్న మమకారము నీపయి గల్గనేర్చునే?

రాక్షసజాతి నీపయిన. రాగముచేతనో! వైరమూనియో!
శిక్షలు సొందియో! వెఱపుచేతనో! కొంత త్వదేక భావనా
పేక్ష - తరించుచున్నది. లభించుచునున్నది. నీ కతాననే
యక్షయ లోకసిద్ధి యెటులైనను గావలె నిన్ను జేరుటల్.

రాక్షసజాతిఁ బుట్టినను, రాక్షసచర్యలె సేయుచున్నఁ, బ్ర
త్యక్ష విరోధమూనినను, దానవితో సరితూగువారు నీ
పక్షమునందులేర - యిటువంటి నిశాటినిబట్టి సూవె! నీ
కక్షయమైన కీర్తి జగమందున వ్యాప్తివహించె రాఘవా!

అచ్చెరువందునట్లు సురలా పదునాలుగువేల దైత్యులన్
గట్టి బిగించి కట్టి క్షణకాలములో మసిజేసి - సీత రొ
మ్మిచ్చిన స్వీకరించిన నరేంద్రుఁడవే? యిటువంటికీర్తి నీ
కిచ్చుట నేవిధాన లభియించును, దానవి లేక యున్నచో!

వింటి నినున్ "స్త్రీయంపురుష విగ్రహా" యం చపహాస్యమాడి -
న్నంతె ధరాత్మజాత వనికంచును మున్నటువంటి భార్య - నీ
వొంటి - ఖరాదిరాక్షసుల నొంచుటంజూచి - కుచోష్మరేఖ - నీ
గంటుకుఁ గాపుపెట్టెనటగా!! యెటువంటి యదృష్టరేఖరా!

సీతనువీడి రాఘవుని సేవయొనర్చెడు వారికెల్ల యీ
గీతయె గల్గునంచుఁ దెనిగించి వచించెనుగాని, నీకప
ఖ్యాతిని గూర్పగాఁ దలఁచిగాదుసుమీ! - మనుజాశనాంగనా
ప్రీతియె లేకయున్నఁ గనిపించునె? నీభుజవీర్యశౌర్యముల్.

కన్నుల కర్వుదీర నినుగన్గొని, నీ కమనీయ రూపమున్
సన్నుతిచేసి, నీపయిన చక్కని గీతికల్లి, నీభుజా
సన్న యశస్సుధాలహరి స్నానముసేయు నిశాటికన్న, నెం
దున్నది ధన్యురాలు పురుషోత్తమ! - యెంతతపంబుసేసెనో!

అంచితరూపురేఖ - జగమంత భ్రమింపఁగజేయు నిన్ను మో
హించుట దోసమైన నిఁక నెవ్వడు ప్రేమకు పాత్రుడోయి! కో
పించకు - రాఘవా! యెవఁడు ప్రేమనుజూపిన, కోపమూనినన్,
మంచిని జేసినన్, సదభిమానమునుంచిన, నీ వొకండవే!

నిన్ను వరించి శూర్పణఖ నీకడసేరుటె గొప్పమాట - నీ
కన్న మరొక్కడుండునె? జగంబున చక్కనివాఁడు - కామమెం
దున్నదొ! కోపమండె కలదోయి! రఘూత్తమ! యెందుకోసమీ
విన్ని శ్రమంబులన్ బడఁగనెంచితొ? దానికి సూత్ర మిద్దియే?

రాక్షసజాతియైన - ననురాగము, నీపయి లెస్ససూపి, ప్ర
త్యక్షముగా, ముఖాముఖిని - ద్వాత్సరసోక్తుల నాలకించి, నీ
శిక్షకు దోయిలించె రఘుశేఖర! - యెంత తపంబుసేసె నీ
రాక్షసి - నీ గుణస్మృతిపరంపర దక్కిన దామెకే గదా!

వచ్చెడు జన్మమందయిన బాపము దానవి నేటి కోర్కెలో
నిచ్చుట దీర్ఘమయ్యె, రఘుభూషణ! - యేకులమైననేమి? నీ
పచ్చని రూపమున్ వలచివచ్చిన దందుకె సంతసింపు, మే
మిచ్చిన దీరదోయి ఋణమీమెకు, నీ కిడినట్టి కీర్తికిన్.

నీచుఁడు కాని, కాఁడనని, నీపయి నిశ్చలదృష్టి పెట్టి మా
రీచుఁడు జూచినాఁడు ప్రతివృక్షమునందున నారచీరెతో
గోచి బిగించి కట్టు రఘుకుంజరు - నిన్నిటువంటి భావనా
లోచను లెంతమంది మునులుందురొ! యొక్కనిపేరు చెప్పుమా!

అంతిమ కాలమందు - భవదద్భుతరూపముఁ గంటఁజూచె - నీ
కాంతను సంస్మరించె, నదిగాక త్వదీయుని గూడనెంచె - లే
దింతకు మించి కాదగినదేమియు, నన్నిటకన్న, నీశరా
నంత నిఘాత జన్మస్మృతినందుట - వింతగదా! తలంపఁగన్.

వైదిక కర్మలన్ సలుపువారలు నీదుకటాక్షదృష్టి మ
ర్యాదకుఁ బాత్రులౌదురు - దురంత రజోగుణ దోషదూషితో
న్మాదుల కేదిత్రోవ - నిను మంచిగ జూచుట లేకపోగ, నీ
మీఁదనె కత్తి దూయు కులమిద్ది - తరించుటెఱుంగ దింతయున్.

తెలియద - యెంత సూచినను దేవరవారి మహత్వ మెట్టిదో
తెలియద - యెందుకోసమయి ద్రిమ్మరుచుంటివో! కాననంబులో
దెలియదు - నీవొనర్చుపని దేవతలైన నెఱుంగరన్న - నా
కలవియె? నిన్నెఱుంగుట - మహాద్భుతముల్ భవదీయవృత్తముల్.

మారీచునపుడు చంపక
వారిధిలో మాత్రిమేల పడవైచితివో!
కూ్రిరాసి - దీని జంపని
కారణమేమో! వచింపఁగలవె? మహాత్మా!

శూర్పణఖానిశాటి నిను జూచిన కాల విశేషమేమొ? నీ
నేర్పును - నీభుజామహిమ - నీకరుణా గరిమంబు - నీదు కం
దర్పసమాన రూపమును - తప్పక లోకమెఱింగెఁ - గానఁ జే
కూర్పుము దానికింక రఘుకుంజర! శిక్షయొ!! లేక; రక్షయో!!

ఇంతకుముందు నీవు వధియించిన రాక్షసుఁ డెవ్వఁడయ్యె? శా
పాంతమొ! లేక; నీదు కరుణాంతమొ! కాని, కబంధుఁడన్న, దే
వాంతకుఁ డట్టివాఁడు -భవదద్భుత రూపముసూచి యంతలో
నంతగ మారిపోయె - నివిరా! రఘుసత్తమ! నీప్రభావముల్.

కలిగెను నీకుగొప్ప మమకారము, రాక్షసజాతియందు - నీ
కులధనమైన నీయగల కూరిమిచూపెదు రామభద్ర! నే
పలికిన మాట వాస్తవము. స్వామి మతంగునిసేవ సేయుటన్
దెలిసిన దీరహస్య, మది దేవరవారికి విన్నవించితిన్.

ఇంకను జూడనైతి నసలిప్పటిదాక నిదేమి, రామ నా
మాంకితమైన యుంగరమహా! యిది కైకయి, వ్రేలికుంచెనే?
శంక జనించుచుండె వనిసాగుచునుండగ సొమ్ములన్నియున్
వంకె దగిల్చితీ వెపుడు వచ్చెను వ్రేలికినిద్ది రాఘవా!

కైకయి చూడకున్నె? కటకంబులు, కుండలముల్, కిరీటముల్
చీకటికూడ, వెల్తురుగ జేసెడు హారము లూడలాగి, దా
చేకొని, మీకు వల్కలము చేతికొసంగెడు వేళనైన, నీ
యీ కనదంగుళీయక మిదే! యెద సంశయమాయె! రాఘవా!

నారలుగట్టి దుంప లశనంబుగ మెక్కి జటాజినంబులన్
ధారణసేయు నీకిది యథార్థము వ్రేలికి నుండరాదు - కా
నీ; రమణీయవస్తు విదియేటికి వచ్చెనొ! పెట్టుకొమ్మ - సీ
తా రుచిరాననావిరహతాపము తీర్చునొ! యేమొ! రాఘవా!

అప్పుడయోధ్యలో వెడలునప్పుడు వ్రేలికిలేదు, మధ్య నీ
కెప్పుడొ! సంక్రమించె నిది - యెంచగ మీప్రణయప్రసక్తిలో
నొప్పులొ! తప్పులో! జరిగియుండును? పందెము దీని బెట్టినా
రెప్పుడొ! నీవు గెల్చి లభియించితి విద్ది యరణ్యయాత్రలో.

చిఱునగ వల్లదే! పెదవి చిందుచునున్నది - మల్లెపుష్పముల్
విరిసినరీతి మాకు గనిపించిన - దీ సొగసెన్నినాళ్ల కే
నరసితి - సత్యమైన విషయంబని సాక్ష్యము కోసమేమి? యీ
సరసము చూపినావు సహజస్మితభాషివి నీవు, రాఘవా!

పదిలము - జానకీవిరహభారముతో సగమైతి, వ్రేలికిన్
వదులయి పోయె నుంగరము - భద్రము, జాగ్రత, జారునేమొ! ఇ
య్యది చెయి జారెనేని బ్రతుకంతయు వ్యర్థము, ముందుముందు,
కిదియె శరణ్యమై వెలయు, నియ్యదె జీవమునిల్పు నాయనా!

పొండదే - ఋష్యమూక - మనం బోవుచునుండగ - యోగవాహ్నిలో మండుచునుండెనా - శబరి - మంటలు ధూమము గ్రిక్కుచుండ - రా ముండును - లక్ష్మణుండు కనుమూయక నివ్వెరబోయి చూచు చ ట్లుండిరి - మింటిమీఁద సురలుఁడిరి - నేనొక ప్రక్క నుండితిన్.

ఇది యోగాగ్ని

శ్రీమాన్ కవిరత్న, కవి శేఖర, సుధీమణి,

గుదిమెళ్ల రామానుజాచార్య విరచిత

శ బ రీ కా వ్య ము

138 పద్యములు

స మా ప్త ము.

సర్వం శ్రీ హయగ్రీవార్పణమస్తు



# కృ తి స్వీ కా ర ము

—— 0 ——

భళిభళి ! సుప్రభాత - మెటువంటి మహత్తరమైన భాగ్య మీ
కులమున కబ్బె - నిద్ది యొనగూడుట చూడగ - నాపురాతపః
ఫలమనియెంచగా వలయుఁ - బండితులెందరో నిండియుండగా
గలగలలాడుచున్ సిరులఁ గాంచుచునుండెడి కోరుకొండలో
జెలగిన నాయదృష్టమిది, శ్రీ శబరీకృతి కన్యనిచ్చి, న
న్నిలిపిరి కావ్యసీమ కథనేతగ మాకవిగారు - వారి కీఁ
గలిగిన దీప్రణామ విధిగాఁ కీక, నక్షరలక్షలీయ రా
యలుగ జనింపనైతిగద - యప్పటికైనను, నూరురూకలన్
గలగల వెండిపళ్లెరము ఘల్లని మ్రోయగ బోసి, మేల్ జరీ
వలువలు, జోడు శాల్వలను వారికొసంగిన - నాకుఁ దృప్తిలోఁ
గలుగద - మాపితామహులఖ్యాతిని వర్ణన సేయుచుండగాఁ
గలిగిన భావనాతతికిఁ గన్నులనీరు స్రవించె, మేనికిన్
బులకలుమొల్కరించె, జనిపోయిన పెద్దల దివ్యవృత్తమున్
సులలిత పద్యవైఖరుల శోభిలజేసి, ముదుంబవంశ మన్
గలశపయోధి కీకృతిని, కౌముదిగా వెలయింప జేసినం
దులకు, మహత్తర ప్రణయ తుందిలతోష పరంపరాకృతాం

జలిని పత్రిసూనమట్లు శిరసావహించితి - నీప్రబంధమం
దలి కవితాసుధాధోరణి, పదంబుల సొంపు, వసంతసధ్యలో
జలజలరాలు మల్లియల చాడ్పున, భారతిచేతి వీణలో
గలగలలాడు శబ్దములకై వడి, దివ్యకళిందనందినీ
పులినములో శరన్నిశల మ్రోగెడు కృష్ణుని వేణుగీతికా
కలకలమట్టు లుండుట, ముఖస్తుతిగాదు - నవీనభావనా
దుల కళశర్కరామిళిత దుగ్ధమురీతి, మహాప్రభాగ్య మీ
సులలిత పద్యమాలికల సొంపున కీదృశ సంప్రదాయ ని
ర్మలమహితార్థ కల్పనల మాధురికిన్ వెఱగంది, నేటి కీ
ఫలమును స్వీకరించితిని, పాఠకు లీ కృతి నాదరింపగన్.

ఇట్లు

కృ తి ప తి

ముదుంబై వరాహ నరసింహాచార్యులు.

—

శబరి మల్లికార్జున అచ్చు వేయించుటకు చేయూత నొసంగిన

ఉదారులు :

| | |
|---|---|
| శ్రీమాన్ సముద్రాల రామానుజాచార్యులుగారు (బుట్టాయపేట, బందరు) | 25-0-0 |
| శ్రీమాన్ యస్.టి.జి.యల్. పెరుమాళ్ళాచార్యులుగారు (ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ, బందరు) | 25-0-0 |
| శ్రీ కోట సుందర రామశర్మగారు (చింతగుంటపాలెం, బందరు) | 25-0-0 |
| శ్రీమాన్ ఐ. ఎ. టి. స్వామిగారు (హిందూకాలేజి, బందరు) | 10-0-0 |
| శ్రీ బి. వి. నరసింహారావుగారు (గవర్నమెంటు ట్రెయినింగుస్కూల్, బందరు) | 10-0-0 |
| బోర్డు హైస్కూలు ఉపాధ్యాయసంఘం (ఘంటసాల) | 25-0-0 |
| ఘంటసాల గ్రామస్తులు | 15-0-0 |
| శ్రీ అద్దేపల్లి శివరామయ్యగారు (గొడుగుపేట, బందరు) | 5-0-0 |
| శ్రీ హరి వేంకటరామ సోమయాజులుగారు (చింతగుంటపాలెము, బందరు) | 10-0-0 |
| ఉపాధ్యాయ సంఘము (జైహింద్ సెకండరీ స్కూలు, బందరు) | 15-0-0 |
| ఉపాధ్యాయ సంఘము (బోర్డు హైస్కూలు, కోడూరు) | 15-0-0 |

బహువ్యాపృతులయ్యు, శ్రమకోర్చి దీని ప్రూఫు సరిచూచిన

శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామిగారికి

మిక్కిలి కృతజ్ఞులము. వీరికి శ్రీమన్నారాయణుడు సకలాభీష్టము లొసంగుగాక.

శ్రీ గుదిమెళ్ల రామానుజాచార్యులవారి

# పద్య కావ్యములు.

1. మురళీధర విలాసము
2. విద్యావిలాసము
3. శరద్రాత్రి
4. మాండవి
5. శబరి
6. ఋష్యమూకము
7. పండితగోష్ఠి
8. ఆచార్య సంభావన
9. శ్రీకాకుళేస్వామి శతకము
10. రఘుకులేంద్రస్తుతి
11. యతిరాజ విజయము
12. బదరీయాత్ర
13. గీతాసందేశము
14. గురుప్రభ
15. మధురసూక్తి
16. ద్వయమంత్రార్థము
17. చరమార్థదీపిక
18. భక్తిపదవి
19. ప్రపత్తి వైభవము
20. ధనుర్గాను
21. కలితా విలాసము
22. హృదయ సందేశము
23. కవితానిలయము
24. అష్టాక్షరి
25. మంగళా శాసన వైభవము
26. శ్రీదేవి
27. నటన
28. పూలచెండు
29. వరదరాజ స్తుతి

ప్రాప్తిస్థానము :

ముక్తిపల్లి అగ్రహారము,

రేపల్లె తాలూకా

లేక

వెంకట్రామా అండ్ కో అన్ని బ్రాంచీలు.